# వేదములు,ఉపనిషత్తులు

(సంకలనము: డి.నారాయణరావు, విద్యానగర్, హైదరాబాద్, తెలంగాణా రాష్ట్రం 500044)

వేదములు నాలుగు.అవి 1.ఋగ్వేదము, 2.యజుర్వేదము (ఇందులో మళ్ళీ రెండు విభాగాలు-1.కృష్ణయజుర్వేదము, 2.శుక్లయజుర్వేదము), 3.సామవేదము మరియు 4.అథర్వణవేదము

ఉపనిషత్తులు 108.ఇందు ఋగ్వేదసంబంధితములు 10, కృష్ణయజుర్వేదీయములు 32, శుక్లయజుర్వేదీయములు 19, సామవేదసంబంధితములు 16, అథర్వణీయములు 31.

"శ్రూయతే ధర్మాధర్మావితిశ్రుతిః" (ధర్మము, అధర్మము దీనిచే వినబడుచున్నవి).శ్రుతికే వేదము, ఆమ్నాయము అని పేర్లు.

"విదంత్యనేన ధర్మాధర్మవితి వేదః" (దీనిచేత ధర్మాధర్మములు తెలిసికొందురు).

"ఆమ్నాయతే పారంపర్యేణేత్యామ్నాయః" (ఇది చిరకాలము నుండి పరంపరగా నభ్యసించబడుచున్నది).

వేదము కర్మకాండ,ఉపాసనాకాండ,జ్ఞానకాండ అని మూడు భాగములు.

"బ్రాహ్మణస్త్రిభిర్ ఋణవాజాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయాపితృభ్య ఏషవా అన్నృణోయః పుత్రీ యజ్వా బ్రహ్మచారీ వాసీ" (కృష్ణయజుర్వేదసంహిత, కాండము 6, ప్రపాఠకము 3)

ప్రతి బ్రాహ్మణుడును ప్రధానమైన ఋషిఋణము, దేవఋణము, పితృ ఋణము అను మూడు ఋణములతోనే జన్మించును.

ఋషిఋణము: లోకమున ఋషులవల్ల విజ్ఞానవ్యాప్తి కలిగినది.అందువల్ల మనము వారికి ఋణగ్రస్తులమగుచున్నాము.ఆర్షవిజ్ఞానాధ్యయనము,ప్రచారము,ఆచరణల వల్ల, బ్రాహ్మణుడు సంధ్యావందనాది విహితకర్మల ద్వారా ఋషిఋణము తీర్చుకొనును.

దేవఋణము: మనము ఆహారము కొరకు దేవతలకు ఋణగ్రస్తులమై ఉన్నాము.యజ్ఞయాగాది క్రతువులు చేసి హవిస్సును అగ్నిద్వారా దేవతలకందించుటద్వారా అంటే యజ్ఞ కర్మాచరణము వలన దేవఋణము నుండి విముక్తి పొందగలము.

పితృ ఋణము: దేహములు పితృదేవతానుగ్రహ లబ్దములు.దేహము కొరకు మనము పితృ ఋణగ్రస్తులము.సత్సంతాన రూపమున దేహములను సృజించి, పిండోదకదానములు చేయుట ద్వారా మనము పితృ ఋణవిముక్తులగుదుము.

కల్పసూత్రముననుసరించి శ్రౌత యాజ్ఞికమునందు ఋత్విగ్వరణములు అధ్వర్యము,హౌత్రము,ఔద్గాత్రము,బ్రహ్మ అను నామములచే ఇవ్వబడును. ఇట్లివ్వబడిన ప్రతి వర్గి (గణము) యందును నలుగురుందురు.మొత్తము 16 గురు.

1.అధ్వర్యగణము :(1)అధ్వర్యుడు (2)ప్రతిప్రస్థాత (3)నేష్ట (4)ఉన్నేత

2.హౌత్రగణము : (1)హోత (2)మైత్రావరుణుడు (3)అచ్ఛావాకుడు (4)గ్రావస్తుతుడు

3.ఔద్గాత్రగణము: (1)ఉద్గాత (2)ప్రస్తోత (3)ప్రతిహర్త (4)సుబ్రహ్మణ్యుడు

4.బ్రహ్మగణము: (1)బ్రహ్మ (2)బ్రాహ్మణాచ్ఛంసి (3)ఆగ్నీధ్రుడు (4)పోత

16 గురు ఋత్విక్కులు యజమాని అతని పత్ని మొత్తం 18 గురు.వీరితో సోమయాగమగును.సోమయాగము గృహస్థుచేయు యాగములలో ప్రధానమైనది.

ఆగ్నీధ్రుడు అగ్నిని ప్రజ్వలింపజేయును.అధ్వర్యుడు యజ్ఞమునందు యజుర్వేదతంత్రము నడుపును,యజ్ఞమంతటిని జరిపించును.భూమిని కొలిచి వేదిక రచించుట,యజ్ఞపాత్రముల సమకూర్చుట మొదలగునవి చేయును.హోత దేవతలనాహ్వానించును.ఋగ్వేదము తెలిసిన వాడై కర్మభాగమును నిర్వహించును.ఉద్గాత సామవేద తంత్రమును నడుపును.ఉపద్రష్ట కార్యములను పరిశీలించిచూచును.

శ్లో ॥అధ్యాపనంబ్రహ్మయజ్ఞఃపితృయజ్ఞస్తుతర్పణం।

హోమోదైవోబలిర్భౌతోనృయజ్ఞో z తిథిపూజనం॥ (మనుస్మృతి :3-70)

పంచమహాయజ్ఞములు అనగా 1.బ్రహ్మయజ్ఞము, 2.పితృయజ్ఞము, 3.దేవయజ్ఞము, 4.భూతయజ్ఞము, 5.మనుష్యయజ్ఞము.బ్రహ్మయజ్ఞమందు అధ్యాపనం, పితృయజ్ఞమందు తర్పణం, దైవయజ్ఞమందు హోమం, భూతయజ్ఞమందు బలి, మనుష్యయజ్ఞమందు అతిథిపూజనం ముఖ్యమైనవి.

శ్లో ॥అధ్యాపనమధ్యయనంయజనంయాజనంతథా।

దానంప్రతిగ్రహంచైవబ్రాహ్మణానామకల్పయత్॥ (మనుస్మృతి :1-88)

యజన,యాజన,అధ్యయన,అధ్యాపన,దాన,ప్రతిగ్రహీతములు అను ఈ షట్కర్మలు బ్రాహ్మణులకు కల్పించబడినవి . ఆచారములు వైదికాచారములు,లౌకికాచారములని రెండు విధములు.శ్రుతి స్మృతులందు చెప్పబడినవి వైదికాచారములు.లోకమున తమకు వీలుగా,ఇష్టమైనవిగా మనుజులు కల్పించుకొన్న కర్మలు,వానిని పరంపరగా ఆచరించుటచే సిద్ధమైనవి లౌకికాచారములు.

వైదిక(సాంప్రదాయ) వివాహ విధానము సూత్రీయము,భట్టీయము అని రెండు విధములు.సూత్రీయమనగా ఆపస్తమ్బ లేదా ఆశ్వలాయన లేదా అన్య గృహ్యసూత్రములననుసరించి చేయబడునట్టివి.ఇందులో విధానము సూత్రరూపములోను వివరణ కొంత తక్కువగను ఉండును.భట్టీయము అనగా వివరణతో కూడిన వాక్యముననుసరించి చేయబడునట్టిది. ఇందులో మంత్రము వెంట వివరణ రూపమైన వాక్యముండును. కావున ఈ పద్ధతి చేయుటకు సులభముగా ఉండును.శాస్త్రమునందు సూత్రీయమునకు ప్రాధాన్యమున్నను క్రియా సౌకర్యార్థం ఇప్పుడు భట్టీయమే ఎక్కువ వాడుకలోనున్నది.సూత్రీయ,భట్టీయములకు కార్యములు జరుపుటయందే ముందు వెనుక భేదములు కాని ప్రధాన మంత్రములందు భేదము కనుపించదు.

శ్లో ॥పురాకల్పేతునారీణాంమౌంజీబంధనమిష్యతే।

అధ్యాపనంచ వేదానాం సావిత్రీవచనంతథా॥

పూర్వం స్త్రీలు బ్రహ్మవాదినులని,సద్యోవధువులని రెండు విధములుగా ఉండేవారు.బ్రహ్మను గురించి తెలిసికొని పరులతో వాదించువారు బ్రహ్మవాదినులు.వీరికి ఉపనయనము,అగ్నికార్యము,వేదాధ్యయనము,గృహము నందే భిక్ష ఉండెడిది.వివాహము చేసుకొని సంసారజీవితం గడుపునట్టి స్త్రీలు సద్యోవధువులు.

శ్లో ॥వైవాహికోవిధిస్త్రీణాం ఔపనాయనికస్మృతః।

పతిసేవాగురౌవాసోగృహార్థోగ్నిపరిక్రియా॥ (మనుస్మృతి :2-67)

వివాహమే స్త్రీలకు ఉపనయనము,పతిసేవయే గురుకులవాసము.గృహ్యకృత్య నిర్వాహకమే అగ్నిహోత్రసేవ.కావున స్త్రీలకు వివాహమే ఉపనయనంతో సమానము.